ప్రాగేవ నిరస్తః.న చ సంభవత్యపి,న హ్యాన్యేనా కారేణాధ్యవసితో అన్యేనజ్ఞానావచ్ఛేదకతయా అధ్యవసీయతే. తథా చ స ఘట ఇత్యుత్పన్నాయాం స్మృతౌ భ్రామ్యత స్తం ఘటమనుభవామీతి స్యాత్. న త్విమం ఘటమితి. న హ్యాయం ఘట ఇతి స్మృతేరాకారః. తస్మాదనుభవ ఏవాసౌ స్వీకర్తవ్యః.

తా. స్వప్నమందుఁ గలుగుజ్ఞానము విపర్యస్తమైన స్మృతి రూపమని యనెదవా? విపర్యస్తమైన స్మృతిరూపమనుదాని కర్థమేమియో జెప్పు? స్మృతివిషయము లేదనియా? అది మా కంగీకారమే. స్మృతియందు అనుభవత్వ మారోపితమనునదియే విపర్యాసమనుట బాధకము లేనందున అటులనుటకు వీలు లేదని జెప్పియేయుంటిమి.

గాక స్మృతియందు అనుభవత్వారోపము సంభవించె ననూ అటులయనుటకు వీలులేదు. యేలనన సఘటః అను స్మృతియం దనుభవత్వ మారోపితమైనచో, (తం ఘటం,) ఆఘటమును గోచరించిన యనుభవముఁ గలవాఁడనను యను సంధానము యుండవలసివచ్చును. ఈఘటమును గోచరించిన యనుభవముఁగలవాడిని. (ఇమం ఘటమనుభవామి) యను సంధానము లేకపోవలసివచ్చును.

ఇది ఘటము (అయం ఘటః) యనునది స్మృతికి యా కారముఁ గాదు. గావున స్వప్నమందుఁ గలుగుజ్ఞానము అనుభవరూపమే గాని స్మృతిరూపము గాదనియే యంగీకరించవలెను.

మూ. అస్తిచ స్వప్నానుభవస్యాపి కస్యచిత్సత్యత్వం,సంవాదాత్. తచ్చ కాకతాళీయమపి న నిర్నిమిత్తం.సర్వస్వప్నజ్ఞానానామపితథాత్వప్రసజ్గాత్.. హేతుశ్చాత్ర ధర్మ ఏవ. స చ కర్మజవత్. యోగజోఽపి,యోగవిధేరవసేయః. కర్మయోగవిధ్యోస్తుల్యయోగక్షేమత్వాత్.

తా. మనస్సుకు ప్రమను బుట్టించుటలోనే బహిరింద్రియాపేక్షగాని భ్రమనుబుట్టించుటలో బహిరింద్రియాపేక్ష యవసరము లేదు. కాన స్వప్నమందుఁ గలుగుజ్ఞానము భ్రమరూపమని యాశంకింపరాదు. సంవాదమునుబట్టి స్వప్నజ్ఞానమునకుఁగూడ ఒకానొకప్పుడు యథార్థత్వము యుండవచ్చును. ఒకానొకప్పుడు కాకతాళీయము గావచ్చినను నిమిత్తములేకుండా గలుగదు నిమిత్తములేకనే గలిగినచో అప్పుడుగలుగు అన్నిజ్ఞానములు యథార్థములైనా గావలయును లేక అయథార్థములైనా గావలయును. కాన నిమిత్తము యున్నదని జెప్పవలెను. అట్టి నిమిత్త మేదనిన, ధర్మమే యగును. అట్టిధర్మము కర్మవలనఁ గలుగునట్టుగా,

యోగమువలనఁగూడ గలుగును. కర్మ విధియు, యోగ విధియు రెండును గూడ సమానమైనవేగాని వీట్లలో ప్రబల దుర్బలభావము లేవు.

మూ. తస్మాద్యోగినామనుభవో ధర్మజత్వాత్ ప్రమా, సాక్షాత్కారిత్వాత్ప్రత్యక్షఫలం. ధర్మాననుగృహీతభావనామాత్రప్రభవస్తు న ప్రమేతి విభాగ ఇతి. అతస్తత్సామగ్రీవిరహో అసిద్ధః.

తా. గాన యోగులకుఁ గలుగుజ్ఞానము ధర్మజన్యమగుట వలన యనుభవరూప మగును. సాక్షాత్కార మగుటంజేసి ప్రత్యక్షరూప మగును ధర్మసహాయములేక కేవల భావనామాత్రమువలనఁ గలుగుజ్ఞాన మప్రమారూప మగును. యోగుల కీశ్వర ప్రత్యక్షముఁ గలుగుట కవకాశమున్నది గాన సామగ్రి లేదనిచెప్పుట సరిగాదు.

మూ. తథాపి విపక్షే కిం బాధకమితిచేత్. ద్వే బ్రహ్మణీ వేదితవ్యే ఇత్యాదియోగవిధివైయర్థ్యప్రసంగః. అశక్యానుష్ఠానోపాయోపదేశకత్వాత్. న చా సాక్షాత్కారిజ్ఞానవిధాన మేతత్. అర్థజ్ఞానావధినా అధ్యయనవిధినైవ తస్య గతార్థత్వాదితి. ఏతేన పరమాణ్వాదయో వ్యాఖ్యాతా ఇతి.

తా. పరమాత్మదర్శనమునువిధించు (ద్వేబ్ర—వేదితవ్యే) అను యోగవిధి వ్యర్థము గావలసివచ్చును గాన పర

మాత్మకు దర్శనవిషయత్వ మంగీకరించనిచో యేమి బాధకమని యాశంకింపవలదు. పరమాత్మదర్శన మశక్యమైనచో అట్టిదర్శ నమును విధించు విధివాక్యోపదేశమునకు వైయర్థ్యము వచ్చును. ఇట్టి విధివాక్యము సాక్షాత్కారవిధాయకము గాదు. అసాక్షాత్కారజ్ఞానమునే విధించుననుటకు వీలులేదు. 'స్వాధ్యాయో అధ్యేతవ్యః' అనువిధిచేతనే గతార్థ మగుచుండఁగా తిరిగి (ద్వే—వేదితవ్యే అనువిధి వ్యర్థము కావలశివచ్చును. కాన పరమాత్మ దర్శనవిషయమని జెప్పవలెను యోగజధర్మము వలనఁ గలుగు దర్శనములో పరమాత్మ విషయమగునని యంగీకరించినందుననే, పరమాణ్వాదికముఁగూడ ప్రమేయముఁ గాన యోగి ప్రత్యక్షములో విషయము గావచ్చును.

మూ. తదేనమేవంభూతమధికృత్య శ్రూయతే. న ద్రష్టుర్దృష్టేర్విపరిలోపో విద్యతే ఇతి. ఏకమేవాద్వితీయమితి. పశ్యత్యచక్షుస్స శృణోత్యకర్ణ ఇతి. ద్వే బ్రహ్మణీ వేదితవ్యే పరం చాపరమేవ చేతి. యజ్ఞేన యజ్ఞమయజంత దేవా ఇతి. యజ్ఞా వై దేవా ఇతి. యజ్ఞో వై విష్ణురిత్యాది.

స్మర్యతే చ.—

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ఇతి
మదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగస్సమాచర, ఇతి

యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః ఇతి యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే. ఇత్యాది

తా. పైనసుదహరించిన శ్రుతిస్మృతులవలన ఈశ్వరునకు దర్శనవిషయత్వముఁ జెప్పఁబడుచున్నది. "మదర్థం కర్మ కౌంతేయ" అనేవాక్యముచే కర్మకు ఈశ్వరజ్ఞానార్థత్వము జెప్పినందున జ్ఞానకర్మలకు సముచ్చయము గాదు. ఫలాభిసంధిరహితముగా ఈశ్వరార్పణ బుధ్యాకర్మఁ జేసినచో చిత్తము శుద్ధమై ఈశ్వరోపాసనయందు ప్రవృత్తిఁ గలుగును. పిదప యోగజధర్మమువలన యాత్మ సాక్షాత్కారముఁ గలుగునని యాశయము.

మూ. అనుశిష్యతే చ సాంఖ్యప్రవచనే ఈశ్వరప్రణిధానం. తమిమం జ్యోతిష్టోమాదిభిరిష్టైః, ప్రాసాదాదినా పూర్తేన శీతాతపసహనాదినా తపసా, అహింసాదిభిర్యమైః, శౌచసంతోషాదిబిర్నియమైః, ఆసనప్రాణాయామాదినా యోగేన, మహర్షయోఽపి వివిదషంతి తస్మిన్ జ్ఞాతే సర్వమిదం జ్ఞాతం భవతీత్యేవం విజ్ఞాయ శృత్వేకతాన స్తత్పరో భవేత్. యత్రేదం గీయతే.

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు మామేవేష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః. భోక్తారం యజ్ఞతపసాం

సర్వలోకమహేశ్వరం. సుహృదం సర్వభూతా
నాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి. ఇతి.

తా. ఈసాంఖ్య ప్రవచనమువలనను, భగవద్గీతావచన ములవలనను, ఈశ్వర ప్రణిధానమువలన, మోక్షరూపమగు శాంతిగల్గునని చెప్పఁబడుచున్నది.

శ్లో. ఇత్యేవం శ్రుతినీతిసంప్లవజలై
ర్భూయోభిరాక్షాళితే
యేషాం నాస్పదమాదధాసి హృదయే
తే శైలసారాశయాః,
ంతు ప్రస్తుతవిప్రతీపవిధయో
ప్యుచ్చైర్భవచ్చింతకాః
కాలే కారుణిక త్వయైవ కృపయా
తే భావనీయా నరాః. ౧౮

తా. ఈరీతిని వేదమందును, న్యాయమందునుగల ప్రవృత్తి యనుజలములచే, నాక్షాళితమైనను, ఎవరియొక్క హృదయమున నీవు ప్రతిఫలింపవో, అట్టిపురుషులు పాషాహృదయులే.

సర్వభూతములయందును, దయగల ఓపరమాత్మా! నీకృపచేతనే సర్వజనులు తారణీయులు. నీవిషయమున ప్రతికూలబుద్ధిఁ గలవారినిఁగూడ నొకపుడైనను, నీయెడల భక్తి గలవారినిగా జేయుము.

శ్లో. అస్మాకం తు నిసర్గసుందర చిరా
చ్చేతో నిమగ్నం త్వయీ
త్యద్ధానందనిధే తథాపి తరలం
నాద్యాపి సంతృప్యతే,
తన్నాథ త్వరితం విధేహి కరుణాం
యేన త్వదేకాగ్రతాం
యాతే చేతసి నాప్నువామ శతశో
యామ్యాః పునర్యాతనాః. ౧౯

తా. ఓ స్వభావసుందరుఁడా, సత్యానందనిధి, మాయొక్క చిత్తము చిరకాలమునుండి నీయందే లగ్నమైయున్నను, చంచలమైన దగుటచే, నేటికిని సంతసింపకున్నది. మాయొక్క మనస్సు, నీనిదిధ్యాసనమే గలదగుటచే, అనేకవిధములగు యమసంబంధమైన నరకములను మఱల మేమెట్లు పొంద కుందుమో, అట్లు త్వరితముగా కటాక్షింపుము

శ్లో. ఇత్యేష నీతికుసుమాంజలిరుజ్జ్వలశ్రీ ర్యద్వా
సయేదపి చ దక్షిణవామకౌ ద్వా,
నో వా తతః కిమమరేశ గురోర్గురుస్తు
ప్రీతోస్త్వనేన పదపీఠ సమర్పితేన.

ఇతి శ్రీన్యాయాచార్యపదాఙ్కిత మహామహోపాధ్యాయ,
శ్రీమదుదయనవిరచితం న్యాయకుసుమాంజలి
ప్రకరణం సమాప్తం. తత్సత్.
బ్రహ్మార్పణం భవతు

తా. ఈ ఉజ్వ్వలమైన శోభగల న్యాయకుసుమాంజలి, సత్పురుషులను, తదితరులను, ఆనందింపఁజేయును. ఒకప్పు డట్లు కాకున్నను, హాని లేదు. దేవగురువులగు బృహస్పతికిఁగూడ, గురువగు భగవంతుఁడు, తనపదపీఠమందు నాచే సమర్పింపఁబడిన నీ న్యాయకుసుమాంజలిచే సంతుష్టుఁ డగుఁగాక.

గద్యః

శ్రీ పేరివంశాంభోధి శీతకిరణులును, అంబికారమణ చరణకమలేందిందిరాయమానమానసులు నగు ఆనంతరామయాఖ్యపండితప్రకాండులకును, జగజ్జననీసపర్యాయత్తచిత్తులగు వేంకమాంబకును, ద్వితీయపుత్త్రుఁడును, గౌతమసగోత్త్రుఁడును, మహాలక్ష్మీకళత్త్రోపేతుండును, లలితాపరాభట్టారికాసేవాతత్పరుఁడును, శ్రీ శ్రీ శ్రీ విజయనగర మహారాజ సంస్కృత కళాశాలా ప్రధానోపాధ్యాయుఁడు నగు లక్ష్మీనారాయణశాస్త్రిచే నాంధ్రభాషయందు బరివర్తనము గావింపఁబడిన న్యాయకుసుమాంజలిగ్రంథము, స్వస్తిశ్రీ చాంద్రమాన బహుధాన్యసంవత్సర కార్తికశుక్లపౌర్ణమాసీ సోమవాసరంబున సంపూర్తిని జెందెను

శ్రీః శ్రీః శ్రీః.

పంచమస్తబకము సమాప్తము

లలితాంబార్పణమస్తు.

చెన్నపురి: శ్రీ 'రామా' ప్రెస్సున ముద్రితము.—1939.